ఓం వేంకటేశ్వరాయ నమః
ఓం శ్రీ విఘ్నేశ్వరాయ నమః

# శ్రీ వినాయక వ్రతకథ

ద్విపద కావ్యము



కీ.శే. [illegible] శర్మ

ఓం వేంకటేశ్వరాయ నమః
ఓం శ్రీ విఘ్నేశ్వరాయ నమః

# శ్రీ వినాయక వ్రతకథ

ద్విపద కావ్యము



కీ॥శే॥ చెళ్ళపిళ్ళ బంగారేశ్వర శర్మ

ప్రథమ ముద్రణము : 15 జూలై, 1996
(ప్రథమ వర్ధంతి సందర్భముగా)
ప్రతులు : 500


వెల : అమూల్యము

ప్రతులకు :
శ్రీమతి చెళ్ళపిళ్ళ లక్ష్మీనరసమాంబ
D.No. 5-62-11A,
6/19 బ్రాడీపేట,
గుంటూరు - 522 002.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూ బాకారం
గాంధీనగర్
హైదరాబాద్-80.
ఫోన్ : 7611413.

# విజ్ఞాపనము

శ్యమంతకోపాఖ్యాన సహిత శ్రీ వినాయక వ్రత కథను ద్విపద కావ్యముగా వ్రాసిన నా భర్తగారైన శ్రీ చెళ్ళపిళ్ళ బంగారేశ్వర శర్మగారు వారు పరమపదించక (29 జూలై 1995) పూర్వమే ప్రచురించాలని ఉత్సాహ పడినారు. వారి ప్రథమ సాంవత్సరీకముల సందర్భముగా వారి జ్ఞాపక చిహ్న ముగా ఈ పుస్తకమును ప్రచురించుచున్నాము.

వినాయక చవితి సందర్భముగా చేయు వ్రతములో భాగముగా ఈ వ్రత కథను విని తరించుట మన అందరి కర్తవ్యము. ఈ కావ్యమును, చదివి, విని, ఎల్లరును సిద్ధివిఘ్నేశ్వరుని కృపకు పాత్రులు కావలెనని మా సంకల్పము. నిర్దుష్టముగా ముద్రించుటలో సహకరించిన పద్మావతీ ప్రెస్, హైదరాబాద్ వారికి మా కృతజ్ఞతలు.

ఇట్లు
బుధజన విధేయురాలు

గుంటూరు
15-8-1996

శ్రీమతి చెళ్ళపిళ్ళ లక్ష్మీనరసమాంబ

ఓం వేంకటేశాయ నమః
ఓం శ్రీ విఘ్నేశ్వరాయ నమః
అవిఘ్నమస్తు

# వినాయకోత్పత్తి

అసురేంద్రుడను రాక్షసాధిపుడొకడు
వెసనింద్రుని జయించ వెఱవొందు లేక 1

సోకుమూకల యొజ్జ శుక్రు దర్శించి
ప్రాకటమ్ముగ బల్కె వచనమ్ము లిట్లు 2

ఆక్కటా పలుమాఱు లమరేంద్రుతోడ
పెక్కండ్రు వీరుల వెంట బెట్టుకొని 3

అని జేసి యోడితి నవమానపడితి
దను జాత వైరుల దర్పంబడంచి 4

పగదీర్చ్ కొనగల్గు పద్ధతి జెప్పి
వగదీర్చి కాపాడవలయు నన్నింక. 5

ఆలకింపు మసురేంద్రా చెప్పెద నొక
మేలైన యుక్తిని మేరుశైలమున 6

మాతంగ నామక మౌనివర్యుడు ని
రాతంకముగాజేయు నమలిన తపము 7

నీ కాంత బంపించి నిష్ఠ పోగొట్టి
ఏకాంత సమయమ్ము నెఱిగి 8

వాని గూడిన కాంత ప్రసవించు సుతుడు
దాన వార్య ధిపుని దండింపగలడు. 9

శుక్రుడాలోచించి సూచించియున్న
వక్రమార్గము చెప్పె వనితకు నతడు. 10

అక్కజంపడి కాంత యనియె సూక్ష్మముగ
అక్కటా ధర్మంబు త్యజియించి నన్ను 11

అన్యుని పొందొందు*మనుట ఎట్లొప్పు
అన్య సంగమ వాంఛ అఘము కల్పించు 12

సంకల్పమును మాని సౌజన్య పడుము
పంతాలు నీకేల వాసవుతోడ 13

జాత్యభివృద్ధికై జనుడు స్వార్థమ్ము
నిత్యమ్ము త్యజియించి నిలబడవలయు 14

రాక్షసుల్ పెక్కెండ్రు రణరంగమందు
అక్షయ బాణసంహతి మరణించి 15

పోవుచున్నారు యముని గేహమునకు
దైవశక్తి నడంచు తనయుని గనుము. 16

ధైర్యమ్ముగానుండి తనయుని దెమ్ము
కార్య సాఫల్యమ్ము గలిగింపు మనుచు 17

ఆనవిని సతి పతి యాజ్ఞ పాలించు
టను విధిగ తన యెడం దలంచి 18

పసిడి జరీచీర పట్టు జాకట్టు
పసుపు పచ్చని మేల్మి బంగారు నగలు 19

వదనమ్ము మొదలుగా పాదాల వరకు
సదమల కాంతులు సంధిల్ల దాల్చి 20

తన భర్త పాద పద్మములకు మ్రొక్కి
చనుదెంచె మాతంగ సంయమి కడకు 21

మాతంగ మౌని నిర్మల నగాగ్రమున
పీతాంబరధరుని విష్ణు ధ్యానించి 22

తపము చేయుచు నుండె తరగని దీక్ష
విపులాక్షి పంకజ ద్వితీయమ్ము మూసి 23

చాలకాలము మౌని సన్నిధి నుండి
తాలిమి వహియించి తలచెనా పడతి 24

యీ మౌని వరుడు జితేంద్రియుండగును
కామమ్ము గలిగించి కలియుట యెట్లు 25

సుతుని గనక యెట్లు చూతు నా పతిని
మతిపోవుచున్నది మార్గమ్ము లేమి 26

యోగినీ రూపంబు నొంది మౌనముగ
సాగించెద తపము శ్రద్ధగా ననుచు 27

ననుకొని అయ్యసురాంగన తపము
నానరింపగ దొడంగె యుక్తియుక్తముగ. 28

కొంత కాలమ్మునకున్ కనుల్ దెఱచి
ప్రాంతమందున్న ద్విపద్వయి గాంచి 29

మదన క్రియాసక్తి మౌనివర్యుండు
ఎదుటనుండిన యట్టి ఇంతిని గాంచె 30

ఇందు నిభాస్య నీవేల వచ్చితివి
సుందరీ! యెవతె వంచును కాంతనడిగె 31

అనుకూల కాలమంచరివ యోచించి
అనురక్తి వెలయించి ఆనందపడియె 32

డెందాన అనుపమానందంబు గలుగ
ముందంజ వేసె నామోదించినట్లు 33

వనజాక్షి వీక్షించి పరమ తపస్వి
అనురక్తి సాధించె నామెతో గలసి 34

గర్భంబు దాల్చె రాక్షసుని లతాంగి
అర్భకుండుదయించె నసుర భామినికి 35

అనతి కాలంబున నాత్మజుండెదిగి
పెనురాళ్ళు మింటికి విసరుచు నుండె 36

తన పుత్రు దుష్ప్రవర్తన మాలకించి
తన దివ్య దృష్టిచే తపసి యెఱింగి 37

ఆమె దనుజ కాంత యనుచు గ్రహించి
ఆమె నాత్మజునితో నంపించి వైచె 38

సానందముగ సమక్షమ్మునయందు
ఆ నాతియు సుతుండు అగుపించినంత 39

సంతోషమున పుత్రు జక్కగ పిల్చి
ఎంతయో ఆదరంబెసగ ముద్దాడె 40

శుక్రుని యొద్దకు సుతుని దోడ్కొని పోయి
శుక్రుని తప్పక చంపుబెట్లనియె 41

శుక్రుండు బాలుని జూచి ముదమున
సక్రమమ్ముగ నీవు శంకరు గూర్చి 42

తపము గావింపుము దైత్య కుమార
అపుడు ప్రసన్నుడౌ నంబికా భర్త 43

మరణమ్ము లేకుండ వరము నిమ్మనుము
మరణమ్ము కలిగిన మరల జన్మమ్ము 44

కలుగ కుండెడు నట్లు కరుణింపు మనుము
అలఘుతపము మెచ్చి హరుడిచ్చు వరము 45

గజముఖాసురుడు దీక్షను బూని శివుని
భజియించి ఘోర తపస్సును జేసె 46

వాని తపసు మెచ్చి భర్గుండు వచ్చి
దేని వాంఛింతువో తెలుపు మంచనియె 47

మరణమ్ము లేకుండ మహిని జీవింప
వరమిమ్ము కాకున్న భవముక్తి నిమ్ము 48

అని వేడుచున్న దైత్య కుమారు జూచి
అనెనట్లె యగుననుచు నంబికా భర్త 49

శివుదదృశ్యుండాయె శివభక్తుడేగి
కవి తోడ జరిగిన కథయంత జెప్పె 50

నిజ జనకుని తోడ్క నిలిచి పోరాడి
గజ ముఖాసురుడు దిక్పతుల నోడించి 51

ఇంద్రునెదిర్చి జయించి గర్వమున
ఇంద్రలోకమునెల్ల హింసింప జొచ్చె 52

దనుజులు పెట్టు బాధ సహింపలేక
దనుజారి పతి తోడ దనుజారి కడకు 53

చనుదెంచి దైన్యమ్ము గ్రిదాల గన్పట్ట
వినిపించి రసురులు పెట్టు బాధలను 54

మనుపుము దైత్య సంహారమ్ము చేసి
అని అమరేంద్రుడు హరితోడ బలికె 55

వినుమింద్ర మనము విశ్వేశ్వరుకడకు
జని విన్నవింతము జరిగినదెల్ల 56

బృందారకుల తనవెంట బెట్టుకొని
యిందిరా ప్రాణేశుడేగె కైలాస 57

గిరికి, వారల గాంచి గిరిజారమణుడు
పరమాదరంబున వారితో బల్కె 58

పలు మొగంబుల వేల్పు నళినాక్షయేమి
తెలుపదలచి వచ్చితిరో తెలుపుండు 59

విని బ్రహ్మ శివునితో వివరించి చెప్పె
దనుజుండు పొనరించు దారుణక్రియలు 60

గజముఖాసురు డంద గలుగు పుత్రకుని
భుజ పరాక్రమశాలి బుట్టింపుమయ్య 61

అని హరి పలియుంప వ్రదికా శక్తి
దనుజు నిర్భయముగ స్వర్గనగరికి 62

అని అభయమునిచ్చి అత్యాదరమున
చనువెంచిరి సురలు స్వర్గమ్మునకును 63

పొగను దనము కని కుతలోగలుగ
నగరాజ పుత్రిక స్నానమ్ము చేయ 64

తనమేన నున్న మెత్తని పిండి దీసి
మనసైన యొక్క విగ్రహమును జేసి 65

ప్రాణమ్ము పోసి ద్వారము వద్ద నిలిపి
స్నానమ్ము చేసి తొందరగ వచ్చెదను 66

భవనమ్ము లోనికి పంపకు మెవరిం
శివుడైన హరియైన బ్రహ్మయేయయిన 67

రజతాద్రిగల మందిరమ్మున యందు
గజయాన స్నానమ్ము గావించు చుండె 68

ముజ్జగమ్ముల వారి మొఱలాలకించి
సజ్జన బృంద రక్షణమును జేయ 69

సురవైరియగు గజాసురు సంహరించి
యరుదెంచె గృహమున క్రీడా భర్త 70

ద్వారపాలకుడైన తనయుండు లేచి
పోరాడ దొడగె శంభుని తోడ నపుడు 71

శివ సృజియించిన యట్టి చిన్నవాడనుచు
శివుడెఱుంగక వాని వధియించె నపుడు 72

తన యింటి లోనికి త్వరగనేతెంచె
తన మేన నగలు వస్త్రమ్ములు దాల్చి 73

చనుదెంచె తనభర్త శంభుని కడకు
దనుజ సంహరణ గాధను మెచ్చదొడగె 74

తమ ప్రసంగమ్మున ద్వారమ్ము వద్ద
శ్రమ పెట్టె తన్నొక్క సాయుధవ్యక్తి 75

వాడి కైదువులతో బాలకుండతడు
వాడెవ్వడని యామె ప్రశ్నించె శివుడు 76

జరిగిన విషయమ్ము సాంతమ్ము దెలిపి
మరి మీరలెట్లు మందిరాంతరము 77

చేరితిరంచు ప్రశ్నించెను గౌరి
ద్వారమ్ము విడిచెనా బాలకుండపుడు? 78

జనన గాధ నెఱుంగమి సమయమ్ము లేక
తనయునే జంపితి తరుణి యటంచు 79

అనియె. వగవసాగె నగజ దుఃఖమున
దానిని విని విషాదపడియె శివుడు 80

ఉమజూచి శంకరుండుల్లమ్మునందు
అమిత కారుణ్యమ్ము నాదరంబెసగ 81

గతగజాసురుని ముఖమ్మునుదెచ్చి 82
మృతబాలు మొండెమ్ము మీద సంధించి

బ్రతికించె దనయుని ప్రాణముల్ పోసి 83
అతివకు నానందమతిశయింపంగ

తమ్మని కంటె ముందర భూప్రదక్షి 84
ణమ్మాచరించి దంత్యాస్యుడు ప్రమథ

గణపాలుడై విఘ్నగణ నాథుడాయె 85
ప్రణ మిల్లి దేవతల్ భజయించిరతని

ఆ యమర విరోధి అస్మద్ వరమున 86
ఏ యాయుధము చేతనేని చావండు

నీబుద్ధి బలమున నిర్జింపు మతని 87
నీ బలంబెరుగక నిలిచి పోరాడు

అని చెప్పి పంపించె నచలజా భర్త 88
తనదు పుత్రకుని ప్రోత్సాహంబు పఱిచి

శివునాజ్ఞ వినయానశిరమునన్ దాల్చి
శివపుత్రుడరిగె సంసిద్ధుడై యన్నికి 89

తనదు నస్త్రములు వ్యర్థమ్ము లైపోవ
తన తండ్రి చెప్పిన తరుణమ్ము వచ్చె 90

తన వక్త్రి వామ దంతము ప్రయోగించె
దనుజాతుని వధించి దంతమ్ము వచ్చె 91

అమర వైరి అనింద్యుడను పేర మూషి
కమయి మోయగసాగె గౌరీకుమారు 92

సురలెల్లరును భక్తి నెఱిగి పూజలను
జరిపించిరి అధిక శ్రద్ధ వహించి 93

కుడుములుండ్రాళ్ళు నెక్కువ యారగించి
కడుపును నింపిన గణపతి జూచి 94

వికృతంబుగా నవ్వె విధుం డాకసమున
వికల దృష్టి ఘటిల్లె విడిపోయె పొట్ట 95

దురవస్థ పరికించి దురపిల్లి యగజ
సరసీజవైరిని శపియించె నిట్లు 96

గలుగు మహాపాపములు నీ ముఖమ్ము
తిలకించు వారికి దృగ్దుష్ట బుద్ధి 97

గజ గజ వణకుచు గణపతి గౌరి
భజియింపదొడగెను భక్తి భావమున 98

ముల్లోకముల వారు ముఖములు వంచి
తల్లి యెట్లుందు మాతని జూడకుండ 99

శాపమ్ము తొలగించి సకల లోకముల
కాపాడు మమ్మ ఓ గణనాథ జననీ 100

కుడుము లుండ్రాళ్ళను కుక్షిలో బెట్టి
కడు నెమ్మదిగ గుట్టె కమల సంభవుడు 101

ఆద్రిజా తనయున కాయె దుర్ఘటన
భాద్రపద చతుర్థి ప్రథమ పక్షమున 102

ఆనాటి రాత్రి అబ్జారి వీక్షించు
వానికి నపనింద వచ్చు తథ్యముగ 103

అని పార్వతీదేవి అనుకంప బూని
తన శాపమున శిక్ష తగ్గించి పలికె 104

అచలాత్మజ స్తుతించి ఆనందపడుచు
అచటి వారందరు నరుదెంచి రపుడు 105

ఓం వెంకటేశాయ నమః
ఓం శ్రీ విఘ్నేశ్వరాయ నమః
అవిఘ్నమస్తు

# శ్యమంతకోపాఖ్యానము

శ్రీనభోమణిని ప్రార్థించి వరముగ
తానుపొందిన శ్యమంతక మణిన్ దాల్చి 106

వచ్చి సత్రాజిత్తు వనజాత నేత్రు
హెచ్చయిన చెలిమి దర్శింప వాంఛించి 107

స్వాగతంబొసగి అబ్జాత నేత్రుండు
సాగించెను సరస సంభాషణమ్ము 108

మణిగూర్చి అడిగె సంభాషించు వేళ
ప్రణుతికెక్కిన సూర్యవరమున గలిగె 109

పదియారు బారువుల పసిడి నొసంగు
నిదియంచు వచియించె హితుడు గర్వమున 110

దాని నిమ్మని గోరె దామోదరుండు
నేనియ్యనని జెప్పి హితుడేగు దెంచె 111

భాద్రపద చతుర్థి ప్రథమ పక్షమున
అద్రి ధరుండు పయః పాత్రయందు 112

కనియె చంద్రుదలంచె గౌరీశాపమ్ము
తనకింక నపనింద తప్పదన్కొనియె 113

సత్రాజిదనుజుండు చనె ప్రసేనుండు
క్షాత్ర ధర్మముగ మృగముల వేటాడ 114

మణి ధరించెనతండు మాంస ఖండముగ
మణిని భ్రమించి సింహము వాని జంపి 115

దాని నోటంబెట్టి త్వర పోవుచుండ
దాని భల్లూకమ్ము తరిమి వధించి 116

మణి తన బాలికా మణికి నుయ్యాల
గణనీయముగ గట్టె కదెలెడునట్లు 117

తన శ్యమంతకమణి దామోదరుండు
తనకు నిమ్మని గోర తా నీయకుంట 118

తన తమ్ముని వధించి దాని గైకొనియె
అనుచు సత్రాజిత్తు హరిమీద నింద 119

మోపి పల్వురికి జెప్పుచునుండ వినిన
గోపకుల్ మెల్లగ గొణుగుటను విని 120

క్షీరాన చంద్రు జూచిన కారణమున
వూరక అపనిందవొదవెను నాకు 121

వూరక వుండుట వొప్పదు కాన
నేరుపుతో దీని నిజము గన్గొందు 122

అనుకొంచు పెక్కేంద్ర ననుచరుల గొని
చనుదెంచె నడవికి సరసిజాక్షుండు 123

నలుదెసల్ వెతుక కన్పడె కాననమున
నలినాక్షునకు ప్రసేన కళేబరంబు 124

సింగపుటడుగుల చిహ్నాల గని చ
నంగ అస్తికలు గన్పట్టె నింకనచట 125

భల్లూకరాజంపు పదముద్రల గని
వెళ్ళంగ బాల గన్పించె నుయ్యాల 126

లో మణికాంతుల లోన మెరయుచు
ఆ మణి లాగంగ నా బాల యేడ్చె 127

వచ్చె భల్లూకంబు వనజాక్షుపైకి
హెచ్చయిన బలముతో నెదిరించి పోరె 128

యిరువదెనిమిది రేయింబవళ్ళు తన
యరుదైన బలము క్షయంబౌటజేసి 129

రామావతార వరమ్ము దలచి
దామోదరుండె యీతండని యెఱిగి 130

పాదమ్ములం బడి బాలతోడ మణి
నాదరమ్మున నిచ్చి అంపించె హరిని 131

అనుచరులను గూడి హరి యిల్లు చేరె
తన పురజనుల సత్రాజిత్తు బిలిచి 132

జరిగినదెల్ల విశ్వాస పాత్రముగ
నెఱిగించి యా మణినిచ్చె నాతనికి 133

తన దోషమెఱిగి సత్రాజిత్తువగచి
వనజాక్షునకు సత్యభామతోడ మణి 134

నర్పించి క్షమింపుమని వేడె హరిని
దర్పక జనకుండు తరుణి గైకొనియె 135

వానికామణి నిచ్చి పరిణయంబాడె
మానిను లిర్వురన్ మనసార వలచి 136

పురజను లెల్లరు మోదంబు జెంది
హరిని స్తుతించుచు నర్తించి రపుడు 137

అతుల శ్యమంతకోపాఖ్యానము విను
మతిమంతులకు నింద మచ్చునకైన 138

శశి జూడ కలుగదు శాపఫలమ్ము
వశమే వచింపంగ వనజాక్షు మహిమ 139

ఇతి శ్రీ మదాంగీరస బార్హస్పత్య భారద్వాజస త్రయార్షేయ ప్రవరాన్విత
భారద్వాజగోత్ర ఆపస్తంబ సూత్రయజుశ్శాఖాధ్యాయి బాపనాంబా
కామేశ్వరశర్మ పుత్ర బంగారేశ్వరశర్మ ప్రణీతంబైన
శ్యమంతకోపాఖ్యాన సహిత వినాయక వ్రత కథ యను
ద్విపద కావ్యము సంపూర్ణము.

ఓం వేంకటేశాయ నమః

మంగళ మహత్

శ్రీ శ్రీ శ్రీ



## చెళ్ళపిళ్ళ బంగారేశ్వరశర్మ

జననం : 29-11-1924 మరణం : 29-7 1995

జన్మస్థలం : ఇంజరం

తల్లిదండ్రులు : కామేశ్వరరావు. బాపనమ్మ

విద్యాభ్యాసం : బి.ఎ.. బి.ఇడి. షార్ట్ సర్టిఫికెట్ కోర్సు

ఉద్యోగము : టీచరు-గుంటూరు, నర్సరావుపేట,

## ఇతర రచనలు (ముద్రితములు)

1) రెడ్డిరాజ్య సంస్థాపనము
2) ప్రబంధశ్రీ
3) పద్మిని - పుష్పజాతకము
4) సుమనశ్రీ
5) శ్రీనివాస కళ్యాణము
6) పూర్వ శ్రీనివాసము
ఉత్తర శ్రీనివాసము (మొదటి, రెండు భాగములు)

## అముద్రితములు

1) బ్రహ్మపురాణము (సుమతి)
2) వేంకటేశ్వర శతకము
3) భాస్కర శతకము
4) నూటపదియారులు మొ॥నవి